2.8.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:31 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18


# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి


**జమీన్‌రైతు చందాదారులకు మనవి**

జమీన్‌రైతు పత్రిక చందా అందరు చందా దారులకు 31.3.96 తేదితో అయిపోయింది ఆ విషయం కార్డు ద్వారా కూడా తెలిపియున్నాము. 1.4.96 నుండి జరుగు సంవత్సర చందా, మరియు పోయిన సంవత్సరం నిల్వ వున్న వారు దయచేసి వెంటనే చెల్లించి పత్రిక నిర్వహణకు సహాయ పడవలసిందిగా ప్రార్థన.

-మేనేజరు

# పదవుల పందారం హుళక్కి!

తెలుగు దేశం పార్టీకి ఆగస్టు నెల అచ్చిరాదనే అభిప్రాయం తన విషయంలోనూ ఎక్కడ నిజమౌతుందోనని గుబులు గుబులుగా, దిగులు దిగులుగా వున్నారు ముఖ్య మంత్రి చంద్ర బాబు. ఈ నెల గడిస్తే చాలు నన్నట్లుంది ఆయన వైఖరి.

అది యాదృచ్ఛికమో, మరేదైనా కారణమో తెలియదు. కాని, పన్నుల పెంపు, ఆల్మట్టి డ్యాం సమస్యలు రెండూ ఈనెల ప్రారంభంలో ఉధృతమైనాయి. ఈ రెండింటి వల్ల తన ప్రభుత్వానికి ప్రత్యక్ష ప్రమాదం ఏదీ లేక పోయినా స్లోపాయిజన్ వలె అవి తనను, తన పార్టీని కృశింప జేస్తాయన్న దిగులు చంద్ర బాబును పీడిస్తున్నది. పన్నుల పెంపు తాను సృష్టించిన సమస్యే; సవాల్ ఎదుర్కో వలసి వుంటుందన్న సంగతి తెలిసి తీసుకొన్న నిర్ణయం అది. అంతటి కఠిన నిర్ణయం తీసుకొని, ఆదాయం పెంచుకొంటే ప్రభుత్వం నడపడం అసాధ్యమన్న అభిప్రాయంతోనే ఈ సమస్య సృష్టించా రాయన. అయితే ఇటు కాంగ్రెస్, అటు బిజెపి పార్టీలు రెండూ ఎందువల్లో పన్నుల పెంపుపై వెంటనే ప్రతి స్పందించ లేకపోయాయి. ప్రజలలో ఉవ్వెత్తున ఆగ్రహం వెల్లువెత్తే వాతావరణాన్ని సృష్టించ లేక పోయాయి. సాధారణంగా ఇటువంటి ప్రభుత్వ నిర్ణయాలపై ప్రజల, ప్రతిపక్ష పార్టీల ప్రతిస్పందన వెనువెంటనే కన్పిస్తుంది. ఉద్యమాలు, ఊరేగింపులు, ప్రదర్శనలు, బంద్‌లు వెంట వెంటనే జరుగుతాయి. ప్రభుత్వం వూపిరి పీల్చే వ్యవధి వుండదు. ఇప్పుడు మాత్రం అటువంటి తీవ్రతను సృష్టించడంలో ఈ రెండు పార్టీలూ విఫలమైనాయి. అందుకు సంతోషించే సమయంలో 30 తేది జరిపిన బంద్ స్వచ్ఛందంగా అమలు జరగడం ముఖ్య మంత్రిని కలవరపాటుకి గురి చేస్తున్నది. బంద్‌ను ప్రతిఘటించ వలసిందిగా తన పార్టీ కార్యకర్తలను రెచ్చగొట్టి నప్పటికీ అది ఎక్కడా విలు పడలేదు. ఈ నిరసనోద్యమాన్ని నిర్వీర్య పర్చకుంటే జనంలో రాజకీయ ముప్పు మెల్ల మెల్లగా రాజుకొంటుందని భయపడుతున్నా రాయన.

పన్నుల పెంపకం గొడవలో ఆల్మట్టి డ్యాం ఆందోళన వెనక్కి పోయింది. అది దానికంటే ప్రమాదమైనది. ఆల్మట్టి విషయంలో తనను తాను కాపాడు కోవడానికి కేంద్రంలోని దేవగౌడను త్యాగం చేయవలసిన పరిస్థితి ఏర్పడు తుందని భయపడుతున్నారు ముఖ్య మంత్రి. అది నిజం కూడా! డ్యాం ఎత్తు విషయంలో రాజీపడి, కర్ణాటక ఇష్టానికి వదలివేస్తే రాష్ట్ర ప్రజలు చంద్రబాబును శపిస్తారు. కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు మూడింటిలోనూ రైతుల ప్రయోజనాలు దెబ్బ తీయగల శక్తి కల్గి వుంది ఆల్మట్టి డ్యాం! ఏ మాత్రం పొరపాటుగా వ్యవహరించినా తెలుగు దేశం పేరు చెప్పి పల్లెల్లోకి వెళ్లలేని పరిస్థితి ఏర్పడు తుంది. అట్లని గట్టిగా పట్టుబడితే దేవగౌడ ఇరకాటంలో పడతారు. డ్యాం విషయంలో ఒక్క అంగుళం తగ్గించమని సలహా ఇచ్చినా కర్ణాటక రైతులు విరుచుక పడతారు. అంతటి సాహసం దేవగౌడ చేయరు; చేయలేరు. ఆంధ్ర రైతులకు అన్యాయం చేస్తున్న ప్రధాన మంత్రికి మద్దతు ఇస్తే తెలుగు దేశం పార్టీ బ్రతికి బట్టగట్ట లేదు. ఈ సమస్యను సున్నితంగా, చాకచక్యంగా పరిష్కరించుకో గల్గితేనే చంద్రబాబు – దేవగౌడల స్నేహం నిలుస్తుంది. లేకుంటే ఎడబాటు తప్పదు. తెలుగు దేశం మద్దతు ఉపసంహరిస్తే దేవగౌడ పదవి పరిత్యజించ వలసిందే! ఈ ప్రమాదం తప్పించడం కోసమే చంద్ర బాబు తెలివిగా ఈ సమస్యను వాయిదా వేస్తున్నారు. కాని ఎంత కాలం వీలౌతుంది?

> ఆగస్ట్ మొదట్లో ఇంత ఆగం ప్రారంభం కావడం చంద్రబాబుకు గుబులు పుట్టిస్తూంది! పెంచిన పన్నులు, ఆల్‌మట్టి రభస ఆయన్ను కలవర పరుస్తున్నాయి!

ఈ గొడవలన్నీ ఇట్లా పెట్టుకొని మంత్రి వర్గ విస్తరణ చేపడితే అసమ్మతి నిప్పు రాజుకొంటుం దన్నది చంద్ర బాబు భయం. ఆగస్టు నెలలో అసమ్మతిని కొని తెచ్చుకొనే సాహసం ఆయన చేయలేరు. అందువల్ల మంత్రి వర్గంలో మార్పులు ఇప్పట్లో జరగక పోవచ్చు.

హరికృష్ణ ఒకరు, ఎమ్మెల్యేగా గెల్చి ముగ్గురు మంత్రి పదవులకు రాజీనామా చేసి వున్నారు; ఆ ఖాళీలు భర్తీ చేయాలి. కొందరు మంత్రులు వ్యర్థులుగా వున్నారు; వారిని తొలగించాలి. కొత్తగా మంత్రి పదవుల కోసం చాలామంది కాచుకొని వున్నారు; వారిని సంతృప్తి పరచాలి. ఈ దృష్టితో చూసినపుడు మంత్రి వర్గ విస్తరణ ఎంతో కాలం వెనక్కి నెట్టడం వీలుకాదు. కాని ఆ తేనెటీగల తుట్టెను ఈ నెలలో కదిలించేందుకు మాత్రం ముఖ్య మంత్రికి ధైర్యం చాలడం లేదు.

కార్పొరేషన్ ఛైర్మన్ల పదవి పందారం పరిస్థితీ అంతే! ఎమ్మెల్యేలే కాకుండా, జిల్లాల్లో నిరుద్యోగులుగా వున్న పలువురు రాజకీయ ముఖ్యులు కార్పొరేషన్ల కోసం గోరి దగ్గర నక్కల వలె కాచుకొని వున్నారు. దాదాపు ప్రతిరోజూ ముఖ్య మంత్రికి ఈ విషయమై అభ్యర్థనలు, సిఫార్సులు

కొరవ 10 పేజీలో

# చంటి పిల్లలకి తల్లిపాలే దివ్యాహారం!

(అంతర్జాతీయ మాతృ స్తన్య దినోత్సవం సందర్భంగా ఈ ప్రత్యేక వ్యాసం ప్రచురిస్తున్నాము. సం.)

వక్షోజాలనేవి ఆడువారికే కాదు. మగవారికి ఉన్నాయి. యుక్త వయసు వచ్చినాక వానిలో కలిగే అనేక మార్పులు కేవలం స్త్రీలకే పరిమితం. మగాళ్ళలో ఇలాంటి మార్పులు సంభవించవు. జనతస్థితిలోనే వుండి పోతాయి. శృంగార పరంగా మగాళ్ళకు ఆకర్షణ, పాల ఉత్పత్తి ద్వారా చంటి బిడ్డలకు పోషణ ఈ స్తనాల విధులు. ఆడవారిలో దశల వారీగా... అంటే కన్యత్వం సిద్ధించ నున్న తరుణంలోనూ, పెళ్ళయిన పిమ్మటనూ, గర్భవతిగా నున్నప్పుడున్నూ, పిల్లలు కలిగాకనూ, మధ్య వయస్సులోనూ, వృద్ధాప్యంలోనూ అనేక మార్పులకు గురౌతాయి. వక్షోజాల మార్పులను బట్టి ఒక స్త్రీ గర్భవతి అయినదా? లేదా అని కూడా నిర్ధారించే వీలున్నది. గర్భం ధరించని స్త్రీలో చనుకట్టుకు మధ్యలో, చనుమొన చుట్టూతా ప్రాంతం గోధుమ రంగులో వుంటుంది. గర్భవతి అయినప్పుడు ఆరంగు మారి వెల్వెటు రంగుగానో నల్లటి రంగుగానో రూపాంతర మొందుతుంది.

సామాన్యంగా వక్షోజాలు అర్ధవలయా కారంలో వుంటాయి. ఒక క్రమ పద్ధతిలో అమర్చబడిన క్రొవ్వు పదార్థ సంచయాలతో ఇవి నిర్మితమై వున్నాయి. ఈ క్రొవ్వు తెరలు, తెరలుగా వుండి, ఒకదాని కొకటి సన్నని దారాల్లాంటి వానిచే గట్టిగా పట్టిపెట్టబడి వుంటాయి. అందుచేత లోపలివైపున స్పాంజి లాంటి పదార్థం విడివడకుండా, బిగుతుగా వుంటుంది. ఈ కారణంగానే జవ్వని పతుల వక్షోజాలకు, గుండ్రని, నున్నని, బిగుతైన ఆకర్షణీయ ఆకారం సిద్ధించి, వాలిపోకుండా అందంగా వుండ గల్గుతున్నాయి. ఈ క్రొవ్వు పదార్థాల్లోని సముదాయాల్లో పాలను స్రవింప జేసే లాబ్యూల్స్ అనేకం వుంటాయి. అవి చనుమొనల ప్రాంతంలో ఉబ్బి తెరవబడి వుంటాయి. ఈ పాల కేంద్రాలు ఒక దానికొకటి ప్రత్యేక మార్గాల ద్వారా కలపబడి వుంటాయి. బిడ్డ పాలు త్రాగడానికి ప్రయత్నించి నప్పుడు పాలగదులు సంకోచం చెంది పాలు బయటికి చిందుతాయి.

గర్భస్థ దశలో తల్లికి పిండానికి వారధి యైన 'ప్లాసెంటా' లేదా 'మాయ' అనే దాన్నుండి కామ హార్మోన్ల ఉత్పత్తి జరిగి తత్ ప్రభావ కారణంగా రొమ్ముల పరిమాణం జాస్తవుతుంది. ఇలా గర్భధారణ సమయంలో ఉన్నట్లుండి స్తన పరిమాణం వృద్ధి నొందడం వల్ల లోపలి తట్టుగల క్రొవ్వు సాగడం, పైచర్మం వ్యాకోచం చెందడం జరిగి రొమ్ముల పై తెల్లటి చారలు ఏర్పడుతాయి. వీనిని 'స్ట్రైయే' అంటారు. ఇలాంటి తెల్లని గీరలు గర్భం మూలంగా బొడ్డు ప్రాంతంలో సహితం ఏర్పడుతాయి. వీనినే 'స్ట్రైయేగ్రావిడేరమ్' అంటారు. సరిగ్గా ఏ కారణంగా లావెక్కిన వారిలోనైనా తొడలపై ఇలాంటివే ఏర్పడుతాయి. ఆ లావు తగ్గినా ఆ చారలు మాత్రం చెరిగిపోవు. మురతల్లా చర్మం వేలుడ బారుతుంది. వీని నివారణకు విటమిన్ 'ఇ' లాంటి ఆయిల్స్‌ను పైపూతలుగా వాడటం జరుగుతున్నా ఫలితం శూన్యం.

స్త్రీ రజస్వల దశకు చేరినదికల్లా రొమ్ములు వాటి సైజులో ఎదుగుదల ఆరంభిస్తాయి. గొంతు వద్దగల థైరాయిడ్ అనే హార్మోను, స్త్రీసెక్స్ హార్మోనయి నట్టి ఈస్ట్రోజెన్ అనబడేవి ఈ పెరుగుదలలో పాత్ర వహిస్తాయి. పిట్యూటరీ అనబడే గ్రంధిరాజము యొక్క అధిపత్యంలో పైనుద హరించిన (?) హార్మోన్ల పని తనముంటుంది. అయితే స్త్రీ గర్భవతిగా వున్నప్పుడు ఉన్న మోతాదు కన్నా అతిగా రొమ్ములు ఎదగడ మనేదిఆ సమయంలో తయారు కాబడే ప్లాసెంటా లేదా మాయ అనే ఓ పదార్థం ద్వారా ఉత్పన్నం కాబడే ప్రొగెస్టిరోన్ అనే హార్మోన్ ప్రభావమే. ఈ హార్మోన్లను పురుషులలోకి ఇన్జెక్ట్ (?) చెయ్యడం జరిగితే వారి రొమ్ములు కూడా పెరగడం శాస్త్రీయంగా ధృవపడింది.

**డా. జె.పి. రెడ్డి**
MB, BS., FSI (Delhi), FIC (USA)
చర్మ వ్యాధి, సెక్స్ స్పెషలిస్టు
పొగతోట, నెల్లూరు

కడుపుతో ఉండగా "మాయ" అనే పదార్థం మూలంగా ఉత్పన్నమయ్యే కామగ్రంధుల వల్ల స్తనాల పెరుగుదలే కాకుండా, పాల ఉత్పత్తికి కారణమైన గ్రంధులు కూడా పరిపక్వం చెందడం జరుగుతుంది. కాన్పు జరిగి, బిడ్డ తల్లి చనుమొనను పుండుకొని (?) పాలుత్రాగే ప్రక్రియ జరగగానే ఆ గ్రంధులు, నరాలు ప్రతి స్పందనకు గురై పాలు విరజిమ్ముతాయి. ఈ స్పందనలో స్త్రీలు అనిర్వచనీయమైన మాతృత్వానందాన్ని, అనుభూతిని అనుభవిస్తారు.

పాల ఉత్పత్తి కణాల పెంపుకు, వాటి చైతన్యానికి, పాలవిడుదల కార్యక్రమానికి దోహదపడే, మరో ముఖ్యమైన హార్మోను 'ఆక్సిటోసిన్'. ఇది పిట్యూటరీ అనబడే సహజ హార్మోను గ్రంధికి వెనుక భాగాన రిజర్వు కాబడి యుంటుంది.

కొందరిలో పాలు బిడ్డకు సరిపడా వుండవు. మరికొందరిలో అధికంగా ఉత్పత్తి అవుతుంటాయి. అయితే పాల మోతాదు వక్షోజాల పరిమాణాన్ని బట్టి నిర్ణయించరాదు. టెన్నిస్ కోర్టులా చదునైన వక్షాలున్న వనితకు అధిక పాల సంపద వుండనూ వచ్చు. ఎద ఉబ్బి ఎత్తుగా పెద్దసైజు స్తన సంపదగల సతికి, ఆ విడుదలయ్యే పాలు తన చంటికి చాలని విధంగా వుండనూ వచ్చు. పాల గ్రంధుల సంఖ్య, దేహారోగ్యం, వారి పోషకాహార

- * స్తనం సైజుకీ, వచ్చే పాలకు సంబంధం లేదు
- * పాతిక వారాలకు మించి బిడ్డకు పాలు అనవసరం
- * పాలు ఇచ్చే సమయంలో బ్రా ధరించి తీరాలి
- * తల్లిపాలు తర్వాత డబ్బాపాల కంటే బర్రెపాలు శ్రేష్ఠం

పదార్థాలు, హార్మోన్ల చురుకుదనం ఇత్యాదులపై పాల ఉత్పత్తి ఆధారపడి వుంటుంది. అంతేగాని చనుకట్టు పరిమాణాన్ని బట్టి క్షీర పరిస్థితి వుండదు.

ఏ వయసులోఐనా ఆడవారికైనా రొమ్ము లోతట్టున నొప్పి అనిపించినా,

[illegible] 11 పేజీలో

# బ్రతుకు భారం

చంద్రబాబు పెంచిన పన్నులు రాష్ట్ర ప్రజానీకం జీవనాన్ని దుర్భరం చేస్తున్నాయి. బ్రతుకు భారం మోయలేనంత అసాధ్యంగా పెంచి వేస్తున్నాయి. పన్నుల పెంపకం ప్రజలకు కొత్త కాదు. ప్రతి బడ్జెట్‌లోనూ ఎంతో కొంత అదనపు బరువు పైనబడటం, దాన్ని మౌనంగా భరించడం అలవాటే. కాని ఒకే ఒక్క కలం పోటుతో రెండు వేల 500 కోట్ల భారాన్ని ప్రజల నెత్తిన గుదిబండ వలె విసిరేసిన చంద్రబాబు రౌద్ర్యాన్ని మాత్రం జనం సహించలేక పోతున్నారు.

రాష్ట్రాన్ని ఆర్థిక సంక్షోభం నుంచి గట్టెక్కించ డానికి పన్నుల పెంపకం తప్ప వేరే గత్యంతరం లేదని ముఖ్య మంత్రి చేస్తున్న వాదన సహేతుకమైనది కాదు. అసలీ సంక్షోభం ఎందుకు వచ్చింది అన్నదే ప్రశ్న; దీనికి బాధ్యత ప్రజలది కాదు. సబ్సిడీ బియ్యం, మద్యపాన నిషేధాల వల్ల ఏర్పడిన ఆర్థిక లోటే సమస్యకు కారణం. ఇవి రెండూ రాజకీయ ప్రయోజనకర పథకాలు. తెలుగు దేశం పార్టీ తన ప్రతిష్ఠను నిల్పుకోవ డానికి ప్రవేశ పెట్టినవి; అమలు చేస్తున్నవి. ఓట్ల కోసం పాలకులు పడేపాట్ల వల్లనే రాష్ట్ర ఖజానా అగచాట్లకు గురైంది. అది ప్రజల తప్పు కానప్పుడు, శిక్ష మాత్రం ప్రజలెందుకు అనుభవించాలి?

ఈ రెండు పథకాల వల్ల ఏర్పడే లోటును ప్రజలకు భారం కాని మార్గాల ద్వారా పూడ్చుకోవడమో లేదా ఆ పథకాలు రద్దు చేయడమో సమంజసం. కేంద్రం నుంచి నిధులు తెచ్చుకునో, కొత్త పరిశ్రమల స్థాపన ద్వారా అదనపు పన్నుల ఆదాయం సాధించి ఈ సంక్షేమ పథకాలు అమలు చేస్తే అందరూ హర్షిస్తారు. వాణిజ్య పన్నుల విభాగంలో అవినీతిని అదుపు చేసినా వెయ్యి కోట్లకు పైగా రాబడి వస్తుందని నిపుణులు చెప్తున్నప్పుడు ఆ దిశలో కృషి చేయడం మాని కొత్త పన్నులు విధించడం అన్యాయం కాదా?

విద్యుత్ రేట్ల విషయమూ అంతే. భారమంతటినీ వ్యవసాయ రంగంపైన, గృహావసరాల పైన మోపారు. కరెంట్ చోరీని అరికట్టడం; పంపిణీ యంత్రాంగాన్ని ఆధునీకరించడం ద్వారా లైన్ లాస్‌లు తగ్గించడం జరిగితే విద్యుత్ బోర్డు నష్టాలు పూడిపోతాయి. హైడల్ పవర్ కేంద్రాలలో యూనిట్ ఒక్కింటికి కేవలం 10 లేదా 15 పైసల ఖర్చుతో విద్యుత్ ఉత్పత్తి అవుతున్నది. మన మొత్తం విద్యుత్ ఉత్పత్తిలో మూడవ వంతు హైడల్ కేంద్రాల నుంచే వస్తున్నది. అటువంటప్పుడు నష్టం ఎక్కడ ఎవరి వల్ల జరుగుతున్న దనేది అంచనా వేయడం అవసరం కాదా? అది చూడకుండా రైతులను చావబాదడం అన్యాయం కాదా? అంతంత కరెంట్ చార్జీ చెల్లించి వ్యవసాయం చేయడం ఆర్థికంగా లాభసాటి అవునా కాదా అని ఆలోచించ వలసిన బాధ్యత ప్రభుత్వంపై లేదా? కేవలం ఖజానాను నింపు కోవడమే ధ్యేయంగా పెట్టుకున్నారే కాని, దీని వల్ల రైతు ఎంత నష్టపో తాడు, వ్యవసాయ రంగం ఎంత కృశించి పోతుంది అన్న విషయమే చంద్రబాబు పట్టించు కోలేదు. అది అన్యాయం, అక్రమం.

పెరిగిన పెట్రోలు ధరలతోనే జనం ఊపిరి సగం ఆగిపోయింది. దానికి ఈ పన్నుల పెంపకం తోడు కావడంతో మధ్య తరగతి వర్గాల ప్రజలు, రైతులు బ్రతకడం అసాధ్యంగా పరిణ మించ బోతున్నది. ఈ ఆర్థిక భారంతో ఈ వర్గాల ప్రజల రాబడి వారి కుటుంబానికి మూడు పూట్ల తిండి పెట్టడానికే చాలీ చాలని స్థితి ఏర్పడడం వల్ల ప్రజలలో కొనుగోలు శక్తి నశించి పోతుంది. అది ప్రత్యక్షంగా ప్రజలకే కాదు, పరోక్షంగా దేశ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికే తీరని విఘాతం. దీనివల్ల పొదుపు మాయమై, సంపదంతా సంపన్న వర్గాల జేబుల్లో చేరిపోతుంది. సామాజికంగా విపరీతమైన అసమతౌల్యానికి దారి తీస్తుంది. ఉద్యోగులు వెల గడవడానికి అప్పులు చేయడమో, అవినీతికి పాల్పడటమో మినహా గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడు తుంది.

జమీన్‌రైతు

ఇన్ని అనర్థాలకు కారణ భూతమైన పన్నుల పెంపకం పట్ల చంద్ర బాబు ప్రభుత్వం పునరాలోచన చేయడం అవసరం. సబ్సిడీ బియ్యం వల్ల పేదవారికి నెలకు 100 నుంచి 120 రూపాయల లాభం సమకూరితే; మధ్య తరగతి వర్గాలకు పన్నుల పెంపకం వల్ల నెలకు 1000 రూపాయలు, రైతులకు ఎకరాకు రూ.2,000లు అదనపు ఖర్చు పెరుగు తున్నది. ఈ దృష్టితో పరిశీలించి నప్పుడు సబ్సిడీ బియ్యం పేరుతో ప్రజలను దోపిడీ చేసినట్లవు తుందే తప్ప, అది సంక్షేమం కానేరదు. మద్య నిషేధం పరిస్థితీ అంతే! ఇప్పటికైనా ముఖ్య మంత్రి తన క్రూర నిర్ణయాలను సమీక్షించడం అవసరం.

---

## జమీన్‌రైతు

2-8-46 వెల: 0-1-6

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### వెంకటగిరి పెళ్ళి

శ్రీ రాజాసాహెబ్‌ల వారి పుత్రులు - అంటే యువరాజాగారి పెళ్లి 17వతేది వెంకటగిరిలో జరుగుతుందట. వధువు దేవర్ల గ్రామముకు సర్వలక్షణ సంపన్న యగు పెదపవని తనయ ప్రస్తావన ముగిసి పోయిందనీ, రాజమాత తన మనమరాలిని చేసుకోలేదనే బెంగతో పెదపవని గృహం చేరిందనీ, వెంకటగిరి టవున్‌లో రెఫరెండం తీసుకొంటే మనుష్యులే గాక పిసుగులు, అవ్వలు కూడా పెదపవని ప్రక్క మొగ్గు చోతవని గూడ పుకారు.

వెంకటగిరి పౌరులంతా అబాల గోపాలం యీ విచారంలో నిమగ్నులై ఉన్నారంట. ఎందుకావీరికిన అనవసర ప్రసక్తి అనిపిస్తుంది.

#### చక్కెర

5వలాల చీట్లన్నీ రద్దు చేశారు. రామమూర్తిదొర. కలెక్టరుగార్ని ఇరిగితే శాఖీ ఆగని వాళ్ళవి రద్దు చెయ్యమన్నాననియు, ఆ విషయం తాను పరిశీలిస్తానని చెప్పారు.

#### గీతాపఠనం

ప్రతి ఆదివారం ఉ.8.00కి నెల్లూరు పండాఫీసు మిద్దెమీద గీతాపఠనం ఉపన్యాసాలు జరుగు చున్నవి.

#### ఎలిగెంటు స్టోర్సు

నెల్లూరు ఎలిగెంటు స్టోర్సు వారు 27తేదిన వారి సంవత్సరాదికి అభిమానులందరినీ పిలిచి, చందనం వల్లగారుడ్డి తాంబూలమిచ్చారు.

#### వ్యభిచారులు - రౌడీలు - బ్రోకర్లు

చాలా రోజాలుగా నెల్లూరు బస్టాండ్ల వద్ద, సినిమాల వద్ద, రాత్రిళ్ళ స్త్రీలను మోసగించి, రౌడీజం జరుపు చున్నట్లు, యీ రౌడీలు దినదినము ప్రబలి పోతున్నట్లు మా గూఢచారి తెలుపుచున్నారు. ఏకపాకెట్టు ప్రాబల్యానికి మందు లేనప్పుడు దీనొక్కడ నుండి మందు తేగలదు?

***

నెల్లూరు బజారులో పొత్తూరి లక్ష్మయ్యశెట్టిగారి అంగట్లో పాలడబ్బాలను పోలి వస్తువులతో అమ్ముతున్నారని హిందూ యువక సభ అధ్యక్షుడు సి.టి.ఓ.కు రిపోర్టు చేశారు.

#### పల్లెటూళ్ళ

#### వాసిలి

అల్లూరు తాలూకా బోర్డు ఎన్నికలు చివర్ల సమావేశం 27తేది

కొరవ 11 పేజీలో

---

# ఈ కరెంట్ షాక్ నుంచి రైతులు కోలుకోలేరు!

వ్యవసాయం చేసుకొనేందుకు రైతులు వాడే విద్యుత్ రేట్లు పెంచడం సబబుగా లేదు. మధ్య తరగతి రైతుల కోసం ఎన్టీఆర్ 'అన్నవరం' అంటూ 5హెచ్.పి లోపు మోటర్ల విద్యుత్ వాడకానికి హార్స్‌పవర్‌కు 40 రూపాయలు కట్టమని నిర్దేశించారు. కాని పార్లమెంటు ఎన్నికలు అయ్యేవరకు కబుర్లు చెప్పిన ముఖ్యమంత్రిచంద్రబాబు నాయుడు 5హెచ్.పి మోటారు వాడకానికి హెచ్.పి.కి 300 రూపాయలు కట్టమని ఒక్కసారిగా ఆదేశించడం భావ్యం కాదు. రైతు ఈ భారం భరించలేడు. అంతరేటు చెల్లించి వ్యవసాయం చేయలేడు. పొలాలు బీడుపెట్టవేడు దారి చూసుకోవడం మినహా మరో గత్యంతరం లేదు. పారిశ్రామిక వేత్తల నుండి విద్యుత్ బోర్డుకు కోట్లాది రూపాయల బకాయిలు రావాలని పత్రికల్లో వార్తలు వచ్చాయి. కాని వీటి వసూళ్లకు ప్రభుత్వం ఎటువంటి చర్యలూ తీసుకొన్నట్లు కనపడలేదు. మధ్య తరగతి వ్యవసాయ కుటుంబం నుంచి వచ్చిన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు రైతులకు ఇటువంటి విద్యుత్ షాక్ ఇవ్వడం తగదు. ఇప్పటికైనా ఈ విషయాన్ని ఆయన పునరాలోచించుకొని 5హెచ్.పి మోటారు వాడకం రేటును 75 రూపాయలు మించకుండా చేయాలని మనవి.

గంగవరం టి.ఆర్.కె.ప్రసాద్‌నాయుడు

## జనవాణి

### సామాన్యులు బతికేదెట్లా?

రాష్ట్రంలో సామాన్య, మధ్య తరగతి ప్రజల జీవితం నానాటికీ దుర్భరమై పోతుంది. పోయిన వారం జమీన్‌రైతులో వ్రాసినట్లు వివస్త్రలై కావి, తినేట్లు లేదు. 4వేల రూపాయల ఆదాయం లేకుంటే మధ్య తరగతి కుటుంబాలు టౌన్‌లో సామాన్య జీవనం సాగించలేవు. దీనికి తోడుగా విద్యుత్, పెట్రోల్, గ్యాస్ రేట్ల పెంపకం ఈ వర్గాలకు గోరుచుట్టు పై రోకలిపోటు. అట్టడుగు వర్గాల వారిని బియ్యం రేటు, రైతులకు వ్యవసాయ యోగ్యమైన విద్యుత్ రేటు పెంచడంలోను ప్రభుత్వం మోసగించింది. ప్రభుత్వం పన్నులపై

కొరవ 10 పేజీలో

## ఛీ... ఛీ... ఇంత సంస్కార హీనులా?

# జిపలో బిజెపి దౌర్జన్యం – నీచమైన బూతు పంచాంగం!

27 తేది జడ్పీ మీటింగ్ హాలులో రెవిన్యూ మంత్రి దేవేంద్ర గౌడ్ ముఖ్య అతిథిగా పాల్గొన్న సమీక్షా సమావేశం రసాభాస అయ్యింది.జిల్లా అధికార ముఖ్యులు మహిళా అధికారులు, విలేకరులు, ఇతర పెద్దలు తమముట్లూ వున్న విషయం మర్చిపోయి వ్రాయలేని పరమ నీచమైన భాషలో తిట్టుకొన్నారు జిల్లా నేతలు!

సమస్య స్వల్పమైనది; కాని నాయకులలో సహనం, సంస్కారం అనేవి నశించి పోవడంతో పెద్ద రగడగా మారింది. రెవిన్యూ మంత్రి దేవేంద్ర గౌడ్ రాక సందర్భంగా ఒక సమీక్షా సమావేశం ఏర్పాటు చేశారు. ఎమ్మెల్యేలతో సహా జిల్లాలోని అధికారు లందరినీ, ఎమ్మెల్యేలను, పిలిచారు. పెంచిన పన్నులకు నిరసనగా ఒక వినతి పత్రం ఇవ్వడానికి ఆ సమయంలో బిజెపి నాయకుల బృందం ఒకటి వచ్చింది. పోలీసులు వారిని గేటు దగ్గరే ఆపేశారు. వారు కోపగించుకొని, పోలీసులను త్రోసిపారేసి, లోపలకు వచ్చేశారు. సమావేశ మందిరంలోకి వారు జొరబడకుండా పోలీసులు మరోకసారి ఆపారు. అక్కడా ఘర్షణ. పోలీసులను దులపరించి, తలుపు గడెలు విరగ్గొట్టి లోపలకు దూరేశారు. ఈ త్రోపులాటలో బిజెపి మాజీ జిల్లా అధ్యక్షుడు వరదయ్య చేతికి చిన్న దెబ్బ తగిలినట్లుంది. దానితో ఆయన ఉగ్రుడై పోయాడు.

లోపలకు రావడమే, స్టేజీ ఎక్కి రెవిన్యూ మంత్రి ఎదురుగా టేబుల్‌ను పెద్దగా చరిచి, ఆగం చేస్తూ, గొంతు చించుకొని అరుస్తూ రభస సృష్టించారు. పాపమాయనకేమీ అర్థం కాలేదు. ఏందయ్యా ఈ గలభా అని అడిగేసరికి; వరదయ్య బిజెపి అధ్యక్షుడు సురేష్ రెడ్డి ఇద్దరూ రెవిన్యూ మంత్రిని నానామాట లన్నారు.

అప్పటి వరకు మౌనంగా జరిగేది చూస్తుండిన మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డి లేచి నిలబడి, ఆవేశంలో వూగిపోతూ వారితో నేరు కలిపారు. దాని తర్వాత ఏమి జరిగిందీ వ్రాయలంటేనే అసహ్యం వేస్తున్నది. మంత్రి ఒక ప్రక్క, వరదయ్యలు ఇంకొక ప్రక్క నిలబడి బూతు పంచాంగం విప్పారు. అవి తిట్టుకావు. ఆరడుగుల వంటి మహిళా అధికారులైతే చెవులు మూసుకున్నారు. కలెక్టర్ విస్తుపోయంగా వుండి పోవలసి వచ్చింది. ఒక అరగంట ఈ తిట్ల హరికథా కాలక్షేపం జరిగి;

> మంత్రికైనా నిగ్రహం వుండవద్దా? పోలీసులు నపుంసకులై పోయారేమిటి?

మంత్రి, వరదయ్యలు ఒకరి మీద ఒకరు కలబడే సమయంలో ఎస్‌పి పూర్ణచంద్ర రావు గారు వచ్చి బిజెపి నాయకులను బయటకు పంపించేశారు. అప్పుడూ రచ్చే. వారు వరండాలో నిలబడి సవాళ్లు విసుర్తుండినారు.

ఇంత హీనమైన సంఘటనలు జరుగు తుంటె పోలీసులు ప్రేక్షకుల వలె నిలబడి పోవడం విచిత్రం. డిఎస్‌పి నుంచి ఎస్ఐల వరకు పాతిక మంది వుండి నారక్కడ. ఒక్కరూ రభస చేస్తుండిన కార్యకర్తలను నివారించ లేదు. పోలీసులు తమ పని తాము చేసి వుంటె వారు సమావేశ మందిరంలోకి వచ్చే అవకాశమే లేదు. వారట్లా లోపలకు జొరబడి రెవిన్యూ మంత్రిని నిలదీస్తుంటె ఒక్క అధికారి అడ్డు చెప్పలేదు. పరమ అసహ్యంగా, రోతగా వుండింది పరిస్థితి. పోలీసులు ఇంత చేవ చచ్చిన వారైపోతే, నపుంసకులుగా మారితే అరాచకాలకు అడ్డు వుంటుందా?

బిజెపి నాయకులూ రౌడీఇజంతో ఏమి సాధించ గలమను కొంటున్నారో అర్థమే కావడం లేదు. రాజకీయాలలో కొద్దిపాటి సంస్కారం, సత్ప్రవర్తన వుండ నవసరం లేదా? ఎంత ఆగం చేయగల్గితే, చూచేవారు అంత భయపడి; తమకు మరింత ఎక్కువగా చందాలిస్తారనే నీచబుద్ధి తప్ప రాజకీయాలలో వుండేవారు చేయవలసిన పనేనా ఇది?

మంత్రి రమేష్ రెడ్డికి – వారి నెదుర్కోవడానికి తాను బూతు పంచాంగం విప్పడం తప్ప మరొక మార్గాంతరం కన్పడ లేదా? తాను నోరు పారేసుకొనే కంటె, పోలీసులను గద్దించి వుంటె ఈ రౌడీ మూకను విసిరి వీధిలో వేయరా? మంత్రి పదవిలో వుండి ప్రవర్తించ వలసిన తీరిదేనా?

గొడవ తరువాత రెవిన్యూ మంత్రి తిరిగి మాట్లాడుతూ జాతీయ పార్టీ అని చెప్పుకొనే పార్టీ నాయకులు ఈ విధంగా చేయడాన్ని నిరసిస్తున్నట్లు చెప్పారు. రమేష్ రెడ్డి మాట్లాడుతూ నన్ను ఒరేయ్ – తురేయ్ అన్నా ఊరుకొన్నానని. కాని రెవిన్యూ మంత్రిని చులకనగా మాట్లడడం చూసి

కొరవ 10 పేజీలో

## సణుగుడు

* భాగ్యమ్మ చావు మర్చిపోయారా?
* ఈ లోక వంకర తీయలేరు!
* నాగభూషణమ్మా – నవ్వులాటగా వుందమ్మా!
* జిల్లా ఎమ్మెల్యేల నోరు పడిపోయిందా?

నలుగురు నరపశువుల పైశాచిక క్రీడా వినోదానికి గురై, నడివీధిలో వివస్త్రగా మారి, అందగా నిలవాల్సిన పురజనం, కట్టుకొన్న పతిదేముడు పిరికి తనంతో తననే ఎత్తిపొడిస్తె ఆ అవమానం తట్టుకోలేక, ఆ ఆవేదన దిగమ్రింగలేక ఉరికి తన మెడను అర్పించి, ఈ లోకం నుంచే సెలవు తీసుకొన్న భాగ్యమ్మ చావుకు సంబంధించి పోలీసులు మానవత్వంతో విధి నిర్వహణ చేయలేక పోతున్నారు. ఆ కేసు విషయం పత్రికలకు పాత వార్త కాగానే, దర్యాప్తుకు బూజుపట్టి నట్లుంది.

ఈ పైశాచిక క్రీడా వినోదంలో భాగ్యమ్మ చీరను చేతితో పట్టుకొని లాగిన దుర్మార్గులెట్లా దోషులో; వారిచేత ఆ ఘోరం చేయించిన నీచులు, వారికి ఆశ్రయం కల్పించిన పెద్ద మనుషులూ అంతే దోషులే. కేవలం త్రాగిన మైకంలో ఆ ఘోరం జరగలేదు; అటువంటి ఘోరమేదో చేయడానికే వారిచేత త్రాగించి పంపారన్నది నిజం. కాని ఆ కోణం నుంచి ఎటువంటి విచారణా జరగడం లేదు. పైగా అసలు కేసు నీరు గార్పించేందుకు ప్రయత్నం జరుగు తూందని చెప్తున్నారు. స్థానిక పోలీసుల సహాయంతో, ఇందులో నిందితులైన వారి బంధువులు సాక్షులను బెదర గొడుతున్నారట. వారికి రాజకీయ అండ లభిస్తున్నది. ఈ రౌడీమూకను చూచి, సాక్ష్యం చెప్తే తమ కుటుంబ స్త్రీలకూ ఇదే గతి పడుతుందనే భీతితో ఎవరి పాటికి వారు సర్దుకు పోతున్నారట.

ఎస్‌పి గారూ – ఇటువంటి

**డోలేంద్ర**

కేసుల విషయంలోనైనా నిర్భీతిగా, నిజాయితీగా వ్యవహరించేట్లు చూడలేరా మీ పోలీసులను?

* * *

అంత గబ్బుపట్టి, అంతగా రచ్చకెక్కి, అంతటి అవమానం చవిచూచిన తర్వాత కూడా జిప ఛైర్మన్ నాగభూషణమ్మ గారిలో మార్పు వచ్చినట్లు లేదు. అయ్యవార్ల దగ్గర దండిన డబ్బు వాపసు చేయక పోవడమే కాదు – "స్పెషల్ జిఓ తెప్పించి మీరు

కొరవ 7 పేజీలో

## ఎమ్పీ గారికి వినతి!

# రైళ్లాగే ముందు, స్టేషన్ రూపురేఖలు మార్చాలి!

ఇన్నాళ్లకుమన నెల్లూరు పార్లమెంటు నియోజక వర్గ ప్రజలకు పనిచేసే పార్లమెంటు మెంబరు లభించడం విశేషమే. ఒకనాటి అంజనప్ప నుంచి నిన్నటి పదశ్రీ వరకు, అందరూ తమ సొంత పనులను చక్కబెట్టు కొన్నవాళ్లే; తమను తాము తరింప జేసుకొన్న సేవా దురంధరులే. నెల్లూరు ప్రజల అవసరాలను - సమస్యలను పట్టించుకొని, పట్టుబట్టి పనులు చేసి చూపెట్టిన పుణ్యాత్ములు ఒక్కరూలేరు. ఈమాట కటువుగా వినబడవచ్చు; కాని నిజానికి నిష్ఠూరానికి దగ్గరి చుట్టరికం ఉందికదా!

ఇప్పుడు మన పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి పనబాక లక్ష్మి తన పనితనాన్ని చూపించే ప్రయత్నంలో ఉన్నట్టుంది. ప్రమాణ స్వీకారం అయిన వెంటనే నెల్లూరుకు చెందిన రైల్వే స్టేషన్లలోని కొరతలను, రైల్వే ప్రయాణికుల అగచాట్లను వివరిస్తూ రైల్వే మంత్రి శ్రీరాంవిలాస్ పాశ్వాన్‌కు ఒక విజ్ఞాపన పత్రం సమర్పించింది. అందులో వేదాయపాళెం స్టేషన్ ప్రస్తావన కూడా ఉంది.

ఎక్స్‌ప్రెస్ రైళ్లు కొన్నింటిని వేదాయపాళెంలో నిలిపించాలన్న ఆలోచన లక్ష్మిగారికి రావడం మంచిదే. అయితే మెమోరాండం తయారుచేసుకొనే ముందు ఆమె వేదాయపాళెం స్టేషన్ను ఒకసారి పరికించి ఉంటే, కొన్ని వివరాలు సేకరించుకొని ఉంటె బాగుండేది.

ఎక్స్‌ప్రెస్ రైళ్ల క్రాసింగ్, ఓవర్ టేకింగ్‌ల కోసం బ్రిటీషువారి కాలంలో నిర్మించిన స్టేషను అది. అప్పట్లో ప్రయాణికుల సంఖ్య, వాళ్ల స్థాయి అల్పం. అందువల్లనే అక్కడ సౌకర్యాలు చాలా స్వల్పం. ప్లాట్ ఫారంలు

**నెల్లూరు సంగతులు**

రెండున్నాయి. రెండూ లోలెవల్ ప్లాట్ ఫారాలే; రైలు పట్టాకు కనీసం అడుగు ఎత్తు తక్కువగా వుంటాయవి. చిన్నా చితకా, ముసలీ ముతకా ఎక్కాలన్నా, దిగాలన్నా కనా కష్టం; ప్రమాద భూయిష్ఠం.

మొదటి ప్లాట్‌ఫారం మీద నాపరాళ్లు పరిచారు; అవి అక్కడక్కడా నోళ్లు తెరిచి ఉన్నాయి. రెండవ దాని మీద మెట్టుమట్టి; (మరుంమట్టి), గడిక పోచలు పొరుచు కొస్తున్నాయి.

ఏకే ప్లాట్‌ఫారం మీద రెండు లావట్రీలున్నాయి; సెప్టిక్ ట్రిన్లే కాని ఓవర్ హెడ్ ట్యాంకు నుంచి ఆ లెట్రిన్లకు

కొరవ 8 పేజీలో

# టౌన్‌లో పిట్ట కదలకుండా కట్టడి చేశారు కాంగ్రెసీయులు!

రాష్ట్ర ప్రభుత్వం పెంచిన పన్నులను నిరసిస్తూ 31 తేది మూడు కుంపట్లుగా కాంగ్రెస్, బిజెపి, ఎన్టీఆర్ తెలుగు దేశం పార్టీలు జరిపిన బంద్ టౌన్‌లో విజయ వంత మయ్యింది. వ్యాపార సంస్థలు మూసి వేయడంతో పాటు ఆర్టీసి బస్సులను ప్రభుత్వమే నిలిపి వేయడంతో రోడ్లన్నీ నిర్మానుష్యమై పోయాయి. బంద్ నిర్వాహకులు కొన్ని చోట్ల ద్విచక్ర వాహనదారులను ఉదయం పూట తిరగనీయ కుండా ఆపివేయడంతో అక్కడక్కడా గొడవలు జరిగాయి. కలెక్టరేట్ వద్ద కాంగ్రెస్

> బంద్ సూపర్ సక్సెస్

నాయకులు, ఆర్టీసి రీజియన్ కార్యాలయం వద్ద బిజెపి నాయకులు అలజడి సృష్టించారు. మహిళా కాంగ్రెస్ నాయకురాలు పందిళ్లపల్లి అరుణమ్మ జమ్ముతావి ఎక్స్‌ప్రెస్‌ను, ఎన్టీఆర్ తెలుగు దేశం నాయకుడు రావుల అంకయ్య గౌడ్ నాయకత్వంలో రెండు గూడ్స్ రైళ్లను రైల్వేస్టేషన్‌లో ఆపేశారు. ఎప్పుడూ లేని విధంగా స్వయంగా బంద్‌ను పర్యవేక్షి స్తుండిన డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి కార్యకర్తలతో కలెక్టరేట్ చేరుకొని కలెక్టర్‌తో పేచీ పెట్టుకున్నారు. ఆనం

కొరవ 11 పేజీలో

# మండలాధ్యక్షుడి పుణ్యాన స్కూళ్లన్నీ మూత పడిపోయాయి!

అనంత సాగరం మండలంలో ఇటీవల జరిగిన ఉపాధ్యాయుల బదిలీల వల్ల పలు పాఠశాలలు మూతపడ్డాయి. మండలాధ్యక్షుని ఏకపక్ష వైఖరి వల్ల ఈ దుస్థితి దాపురించింది. మూత బడిన పాఠశాలలు తెరిపించాల్సిన బాధ్యత తమదికాదని అధికారులు తప్పించుకోవడాన్ని ప్రజలు విమర్శిస్తున్నారు. మండలంలోని దావురాళ్ల పల్లి ఎస్‌సి కాలనీలో వున్న సింగిల్ టీచరును ఇటీవల చిలకలమర్రి గ్రామానికి బదిలీ చేశారు. ఈస్కూలుకు పిల్లలు సరిగా రావడం లేదని అందువల్ల ఈ పాఠశాలను మూసేస్తున్నామని అధికారులు చెబుతున్నారు. అయితే టీచర్ సరిగ్గావస్తే పాఠశాలకు పిల్లలెందుకు రారని గ్రామస్తుల వాదన. గోవిందంపల్లి ప్రాథమిక పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయుడ్ని లక్ష్మీందాజాపల్లి గ్రామానికి బదిలీ చేసి అక్కడికి దోమల్ల పాఠశాల ఉపాధ్యాయుడ్ని వేశారు. కాని ఆయన ముస్తాపురం పాఠశాలకు మండలాధ్యక్షుని సిఫార్సుతో వెళ్లి జాయిన్ అయ్యారు. దీనివల్ల గోవిందపల్లిలో పాఠశాల గత పది రోజులుగా మూతబడివుంది. ఇదే విధంగా గుంటపల్లి పాఠశాలకు తాళాలు వేసి వున్నాయి. మూతబడిన స్కూళ్లకు టీచర్లను నియమించమని అధికార్లను కోరితే మండలాధ్యక్షుని అనుమతిసుకొస్తే ఆర్డర్లు వేస్తామంటున్నారు. మండలంలో విద్యాభివృద్ధికి పాటుబడ వలసిన మండలాధ్యక్షుడు స్కూళ్లు మూతపడే పరిస్థితిని స్వయంగా తానే సృష్టించడం శోచనీయం.

### అనంత సాగరం అవకతవక

### కరతుమ్మ తోపులో ప్రయాణం

ఆత్మకూరు నుండి అనంత సాగరం వెళ్లే రోడ్డుకు ఇరువైపులా కరతుమ్మ చెట్లు రోడ్డును సగం వరకు ఆక్రమిం చేశాయి. దీని వల్ల బస్సులో అద్దాల ప్రక్కన కూర్చొని ప్రయాణించేవారు పడరాని పాట్లు పడుతున్నారు. ఆర్టీసీ బస్సుల అద్దాలు పగిలి పోయి, దిగుడుకబోయి వుండడం వల్ల వీటిని ఎక్కిన వారికి ఇటీవల ముళ్లు తగిలి గాయపడడం, వస్త్రాలు చిరిగి పోవడం జరుగు తుంది. ఈ రోడ్డు గతంలో సోమశిల ప్రాజెక్ట్ ఆధీనంలో వుండేది. ప్రాజెక్ట్ అధికారులు రోడ్డుకు ఇరువైపులా కరతుమ్మ చెట్లు కొట్టించేవారు. ఈ రోడ్డును రోడ్లు భవనాల శాఖకు స్వాధీనం చేసాక దీని ఆలనాపాలన పట్టించు కొనే వారే లేరు. అనంతసాగరానికి ఈ రోడ్డున పోతుంటే కరతుమ్మ తోపులో వెళ్తున్నట్లుంది. ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు గారికి ఈ విషయం పట్టదా?

ఆలమట్టి డ్యాం వల్ల కలిగే అనర్థాలు వివరిస్తూ యువజన కాంగ్రెస్ నాయకుడు జరిపిన రథ యాత్రలో - గూడూరు టవరు దృశ్యం.

# నాటకంపై పోలీసు కన్నెర్ర

'అదరేక మద్దెల ఓడు' చందాన తమ తప్పులు సరిదిద్దు కోకుండా వాటిని వేలెత్తి చూపిన వారిపై కావలి పోలీసు శాఖ ధ్వజమెత్తింది. కాళిదాస కళారాధన సమితి ఆధ్వర్యంలో జరిగిన పోటీల్లో ప్రదర్శించిన నాటికలలో పోలీసు శాఖ పని తీరును తెలియ జేస్తూ చిలకలూరి పేట 'స్నేహలత' సంస్థ ప్రదర్శించిన 'ప్రార్థన' అనే నాటిక జనాన్ని బాగా ఆకట్టుకొంది. ప్రారంభ నాటిక కావడంతో కార్యక్రమానికి అతిథిగా వచ్చిన కావలి డిఎస్పి రవీంద్రరెడ్డి కూడా దీన్నితిలకించారు. అయితే మూడు రోజుల తరువాత ఈ నాటికను రచించిన కావలి రచయిత ఎస్వీ సుబ్బారెడ్డిపై, ప్రదర్శించిన కళాకారులపై పరువు నష్టం దావా వేయదల్చినట్లు పోలీస్ అసోసియేషన్ కార్యవర్గ సభ్యుడు జి.ప్రసాదరావు చెప్పారు. పోలీసులు విధి నిర్వహణలో ఎలా ప్రవర్తించేది, లంచాలకు అలవాటు పడి ప్రజలను ఏ విధంగా ఇబ్బంది పెట్టేది; ఇందులో కళ్లకు కట్టినట్లు చెప్పారు. ఇది పోలీసు సంఘం నాయకులకు నచ్చలేదు. పోలీసుల ప్రవర్తనలో పని తీరులో మార్పు వస్తే వారిని అభినందిస్తూ నాటికలు, సినిమాలు వాటంతట అవే వస్తాయి. పోలీసుల్లో చెడు చూపించి నందుకు నాటకాలపై ఎగిరి పడితేఎలా?

### జిల్లావార్తలు

### నాటక కళాకారులకు అవార్డు లివ్వాలి!

అరువు గొంతులతో నటించే సినిమా నటుల కంటే రంగస్థల నటులు చాలా గొప్పవారని, వీరికి ప్రభుత్వం ముందుగా నంది అవార్డులు ఇచ్చి ప్రోత్సహించాలని సినీ రచయిత జంధ్యాల అన్నారు. కావలి కాళిదాస కళారాధన సమితి జాతీయ నాటికల పోటీలను ప్రారంభించి మాట్లాడారు. సినిమాల ప్రభావంతో నాటక రంగానికి ఆదరణ ప్రోత్సాహం తగ్గి పోతుంది. అటువంటి దశలో 33 సంవత్సరాలుగా నాటక పోటీలను నిర్వహిస్తున్న సమితి నిర్వాహకులను ప్రశంసి చా లన్నారాయన. తమిళనాడు ప్రభుత్వం నాటక కళాకారులకు అవార్డులిచ్చి ప్రోత్సహిస్తుందని; అదేవిధంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం కూడా నాటక

కొరవ 10 పేజీలో

# కులాభిమానం రెచ్చగొట్టనిదే జెండా కట్టేవారు దొరకలేదు!

రాష్ట్ర రెవిన్యూ శాఖ మంత్రి దేవేందర్ గౌడను విద్యాశాఖ మంత్రి దుర్గాప్రసాద్ 28తేది గూడూరుకు తీసుకొచ్చారు. రెవిన్యూ మంత్రిచేత గూడూరులో పలు పథకాల శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలు జరపాలని విద్యామంత్రి తలపోసారు. కాని నిధుల కొరత వల్ల పనులు జరగలేదని అధికారులు, మంత్రుల పర్యటనకు ఎప్పటి మాదిరి మామూళ్లు ఇవ్వలేమని కాంట్రాక్టర్లు, వ్యాపారస్తులు పార్టీనాయకులు చెప్పడంతో ఏంచేయాలో మంత్రికి పాలు పోలేదు. దీనితో మంత్రి గూడూరు డివిజన్‌లోని గౌడ సంఘాన్ని ఆశ్రయించారు. రెవిన్యూ మంత్రి కులస్తుడని, మీ ఆయనకు తగిన రీతిలో స్వాగతం చెప్పాలని కులాభిమానం రెచ్చగొట్టా రాయన. దీనితో పుల్కి తబ్బిబ్బులైన ఆ సంఘం నాయకులు బ్యానర్లు, ఊరేగింపు, భోజనం ఖర్చు వరకు అన్నీ తామే భరించి గూడూరులో భారీహంగామా చేసారు. మంత్రులను జిల్లా ఎమ్మెల్యేలను టాపులేని జీపులో ఎక్కించి పూల వర్షం కురిపిస్తూ టౌనంతా ఊరేగించారు. మంత్రిగారు ప్రతి గౌడ కులస్తుల సభలో మాదిరి, ఉపన్యసించి పరిపెట్టు కొన్నారు. విద్యా మంత్రి మాటవినే ఇంత ఖర్చు చేసినా అప్పటి కప్పుడే పరిష్కారయోగ్యమైన ఒక్క సమస్యనూ మంత్రి పరిష్కరిస్తానని చెప్పకపోవడంతో ఉసూరు మంటూ కల్లుగీత కార్మికులు సభ నుండి వెళ్లి పోవడం కన్పించింది. మొత్తానికి గౌడ కులస్తులు గూడూరులో విద్యా మంత్రి పరువు కాపాడారు.

### కండ్లేరు ముంపువాసులకు 10రోజుల్లో కోటి పంపిణీ!

కండ్లేరు రిజర్వాయరు ముంపు వాసులకు భూసేకరణ పరిహారం క్రింద 10రోజుల్లో కోటి రూపాయలు ఇవ్వనున్నట్లు రెవిన్యూ మంత్రి దేవేంద్రగౌడ్ వెల్లడించారు. 28తేది పొదలకూరులో 7లక్షల 36వేల రూపాయలతో నిర్మించిన ఆర్టీసి బస్‌స్టేషన్‌ను మంత్రి ప్రారంభించారు. ఇతర రాష్ట్రాలతో పోలిస్తే రాష్ట్రంలో ఆర్టీసి ఛార్జీలు తక్కువని; రైతుల సంక్షేమం కోరి రాష్ట్రంలో రోజుకు 9గంటల వంతున విద్యుత్ సరఫరా చేస్తున్నట్లు చెప్పారు. పొదలకూరు బస్‌స్టేషన్‌ను 7లక్షల 36వేల రూపాయలతో నిర్మించారు. బస్టాండుకు అవసరమైన 4 ఎకరాల స్థలాన్ని దేవాదాయ ధర్మాదాయ శాఖనుండి 3లక్షల 80వేల రూపాయలకు ఆర్టీసి కొనుగోలు చేసింది. ఈ స్టేషన్ నుండి 150 గ్రామాలకు బస్సులు రాకపోకలు సాగిస్తాయి. 24 ఎక్స్‌ప్రెస్, 314 ఆర్డినరీ బస్సులు ఈ స్టేషనుకు వచ్చి వెళతాయి. ప్రారంభోత్సవ సభకు రాపూరు ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి అధ్యక్షత వహించారు. శాసనసభ్యులు కొమ్మి లక్ష్మయ్యనాయుడు, పరసారత్నం, జాయింట్ కలెక్టర్ ప్రసాద్, ఆర్డీవో టి.కె.శ్రీదేవి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### విద్యామంత్రి అగచాట్లు!

### గూడూరు డిఆర్‌డబ్ల్యు కళాశాల ఉత్సవం!

గూడూరు డి.ఆర్.డబ్ల్యు కళాశాలలో 16వ జ్యోతి దినోత్సవం 24తేది జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సభకు కళాశాల అధ్యక్షులు అల్లారెడ్డి శ్యామసుందరరెడ్డి అధ్యక్షించి మాట్లాడారు. 15 సంవత్సరాలుగా విద్యార్థినులు జిల్లాలో ఉత్తమ ఫలితాలు సాధించి కళాశాలకు మంచిపేరు ప్రతిష్టలు తెచ్చారని ప్రశంసించారు. సవేరా ట్రస్ట్ కళాశాలకు ప్రతి సంవత్సరం ఇచ్చే పాఠ్యపుస్తకాలను శ్రీమతి జయలక్ష్మమ్మ విద్యార్థినులకు అందజేశారు. ఈ సందర్భంగా కళాశాల ఆవరణలో చెట్లు నాటే కార్యక్రమాన్ని ప్రారంభించారు. హాస్టల్‌లో కుట్టు మిషన్ కేంద్రాన్ని మహిళా మండలి అధ్యక్షురాలు దేవకీ భాస్కరరెడ్డి ప్రారంభించారు. డిగ్రీకళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ ఆ. మెహర్‌మణి, కళాశాల కార్యదర్శి డాక్టర్ సి.ఆర్.రెడ్డి, జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి కె.వర్దనమ్మ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# ఆల్‌మట్టి రథానికి గూడూరులో ఆదరణ

ఆల్‌మట్టి డ్యాం ఎత్తు పెంచికట్టే పనిని ఆపుచేసే వరకు తన పోరాటం ఆగదని పోరాట కమిటీ కన్వీనర్ కోటంరెడ్డి శ్రీధరరెడ్డి చెప్పారు. ఆల్‌మట్టి వల్ల జిల్లాకు జరిగే నష్టాన్ని ప్రజలకు వివరిస్తూ జిల్లా వ్యాప్తంగా తాను రూపొందించుకొన్న రథంలో పర్యటిస్తున్న శ్రీధరరెడ్డి గూడూరు వచ్చారు. పాత బస్టాండ్ సెంటరులో ప్రజల నుద్దేశించి మాట్లాడారు. రాష్ట్రాల మధ్య నెలకొన్న ఇటువంటి సమస్యను పరిష్కరించడంలో కేంద్ర ప్రభుత్వం చొరవ చూపించాలి. సమస్య జటిలం కాకముందే ప్రధాని ఈ నిర్మాణంపై విధాన ప్రకటన చేయాలని డిమాండ్ చేసారు. ఆంధ్రను కరువు కాటకాలతో అల్లాడింప జేసి కర్నాటక సస్యశ్యామలంగా వుండట మేమిటని ప్రశ్నించారాయన. ఉద్యమాలకు పుట్టిల్లయిన నెల్లూరు జిల్లాలో రాజకీయ పార్టీలకు అతీతంగా ఆల్‌మట్టి అన్యాయాన్ని వివరించేందుకు ఉపక్రమించినట్లు చెప్పారు. జమీన్‌రైతు వారపత్రికలో వచ్చిన వార్తల వల్ల ఆల్‌మట్టివల్ల జిల్లాకు జరిగే అన్యాయాన్ని తెలుసుకున్నట్లు వివరించారు. ఆల్‌మట్టి నిర్మాణం ఆపకపోతే ఢిల్లీవెళ్లి ప్రధాని ఇంటి ముందు నిరసన తెలుపను వెనుకాడనన్నారాయన. గూడూరుకు వచ్చిన ఆల్‌మట్టి రథాన్ని కాంగ్రెస్ నాయకులు వేమారెడ్డి వెంకటకృష్ణారెడ్డి, కోడూరు మీరారెడ్డి స్వాగతం చెప్పి బస్టాండు సెంటర్‌కు తీసుకెళ్లారు.

# జయమాలిని మళ్లీ నటిస్తోంది!

"ఈ సారి గ్లామర్‌గా కాదు. నటిగా ఒక చక్కని పాత్రవేయమని ఇటీవల ఒక తమిళ నిర్మాత అడిగారు. అలాగే మంచి పాత్రవుంటే చేస్తానన్నాను. అశ్లీలం, అసభ్యత, డబుల్ మీనింగ్ లేని పాటలైతేనే ఒప్పుకుంటాను." అన్నారు; డబుల్ మీనింగ్ ఏమిటమ్మా, ఇప్పుడొచ్చే పాటలకు అసలు మీనింగే ఉండటం లేదు. కవులు వాళ్ళేదో రాస్తారు. మేమేదో తీస్తాం. చూడక పోతారా ప్రేక్షకులు? "అన్నాడా నిర్మాత." అంది జయమాలిని.

## మద్రాసు సినిమా వార్తలు

### అనువాద చిత్రాల విషయంలో తీర్పు

తమిళంలోకి ఇతర భాషల నుంచి డబ్బింగ్ చేసే ఏ చిత్రానికైనా వంద శాతం వినోదపు పన్ను అధికంగా చెల్లించాలని తమిళనాడు ప్రభుత్వం ప్రకటించింది. అనువాద చిత్రాలను అదుపులో పెట్టేందుకు ఈ చర్య అనివార్యమైంది. కాని, ఇది చెల్లదంటూ అనువాద చిత్ర నిర్మాతలు సంఘం అధ్యక్షుడు, ఎడిటర్ మోహన్ మద్రాసు కోర్టులో కేసుపెట్టారు. తీర్పు ఆయన పక్షానే ఇవ్వడం జరిగింది. ఎడిటర్ మోహన్ ఆగస్టు 1 నుంచి మలయాళం సూపర్ హిట్ చిత్రం "హిట్లర్"ను తెలుగులో పునర్నిర్మిస్తున్నారు. ఇందులో చిరంజీవి తండ్రిగా దాసరి నారాయణరావు నటించడం విశేషం. ముత్యాల సుబ్బయ్య దర్శకుడు.

### "అక్కా బాగున్నావా?" ఆగస్టులో

"అక్కా తమ్ముళ్ళ మధ్య అనుబంధాన్ని కొత్త కోణంలో చూపించిన చిత్రం. అక్కగా జయసుధ. తమ్ముళ్ళుగా ఆనంద్, విక్రమ్‌లు నటించారు. తమ్ముళ్ళ భార్యలు కాపరానికి వచ్చాక జయసుధ అపార్థాలకు గురై, నానా బాధలు పడుతుంది," అన్నారు మౌళి. ఈయన దర్శకత్వం వహిస్తున్న "అక్కా బాగున్నావా" చిత్రంలో రవళి, శుభశ్రీ, తాతినేని రాజేశ్వరి, వేలు, బ్రహ్మానందం, తనికెళ్ళ భరణి, గుండు హనుమంతరావు, నర్రా వెంకటేశ్వరరావు వగైరా నటవర్గం. సంగీతం: కోటి.



"జాబిలమ్మ పెళ్లి" చిత్రంలో రంజిత

# పాటలు పాడడం తగ్గించి నటుడుగా బిజీ అవుతున్న బాలు

ఈ టి.వి వారికి "పాడుతా తీయగా చల్లగా" రికార్డింగుకు వారానికి ఒక రోజు, మద్రాసు దూరదర్శన్ వారికి "నవరాగం" రికార్డింగ్‌కు ఒక రోజు లెక్కన తన సమయం కేటాయించడంతో ఎస్.పి బాలసుబ్రహ్మణ్యం సినిమాలలో పాటలు పాడడం తగ్గించుకునే ప్రయత్నంలో ఉన్నారేమో అనిపిస్తోంది. పైగా నటుడుగా "మైనా, పవిత్రబంధం, మెరుపు కలలు", తమిళంలో "రక్షకన్", "కాదల్ దేశం", అమితాబ్ బచ్చన్ నిర్మిస్తున్న "ఉల్లాసం", "ఆస్టై షణ్ముగం", కన్నడంలో "హృదయకళ్ళరు" వంటిచిత్రాలలో నటిస్తూ, మరో వంక నటుడుగా చాలా బిజీగా ఉన్నారు. అయితే ఎంత ఆలస్యమైనా ఆయనతోనే పాటలు రికార్డ్ చేయించడానికి వేచి ఉన్నారు చాలా మంది నిర్మాతలు.

### వెంకటేశ్వర స్వామిగా సుమన్

కె.రాఘవేంద్రరావు దర్శకత్వంలో వి.ఎం.సి ప్రొడక్షన్స్ నిర్మించే "అన్నమయ్య" చిత్రంలో నాగార్జున ప్రధాన పాత్రధారి. మోహన్‌బాబు మరో కీలకపాత్ర ధరిస్తారు. వెంకటేశ్వర స్వామిగా సుమన్ నటిస్తారు.

### రాజశేఖర్ - జీవిత పుత్రిక నామకరణం

జూలై 21న డాక్టర్ రాజశేఖర్ - జీవితల ముద్దుల పుత్రికకు 'శివాని' అని నామకరణం చేశారు.

# కళాదర్శకులకు తొలి గురువు టివిఎస్ శర్మ

నెల్లూరీయుడు టి.వి.ఎస్.శర్మ ఇప్పటికీ చాలా మందికి గుర్తుండే ఉంటారు. ఇప్పుడు సినిమారంగంలో ఉన్న చాలా మంది కళా దర్శకులకు ఆయన గురువు. తెలుగు సినిమా రంగం తొలి దశలో ఆర్ట్ డైరెక్టర్ బాధ్యత కేవలం పరదాల వరకే ఉండేది. అప్పటికింకా

## కళా ప్రియుడికి కన్నీటి తర్పణం

మౌల్డింగ్ పద్ధతి తెలీదు. స్తంభాలు వగైరాలు కర్టెన్ల మీద పెయింట్ చేసేవారు. ఆతర్వాత సెట్టింగులు వేయడం మొదలెట్టారు. అంతేగాక పాత్రధారుల వస్త్రాల రూపకల్పన బాధ్యత కూడా కళా దర్శకుడే వహించేవారు. జుట్టుముడి, దేహమంతా మందహారాలంకారాలతో 'సత్యభామ' చిత్రంలో నాయికకు తొలుదొల్త రూపకల్పన చేసిన అద్భుత శిల్పి టి.వి.ఎస్.శర్మ. "నర్తనశాల" చిత్రంలో బృహన్నలకు వేషకల్పన చేసిన శర్మకు ఒక చెయ్యిలేదు. ఆయన పడవ ఎట రేవులోంచి వస్తున్న మందుగుండు సామగ్రిని తెలియక పట్టుకోవడంతో అది కాస్తా పేలింది. చేయి వేళ్లు కాలాయి. నాటు వైద్యం చేయించేసరికి ఆ గాయం కాస్తా పెద్దదయింది. కొంత కాలానికి అది చేతి మీదకు ఎగబ్రాకింది. చివరికి సెప్టిక్ అవడంతో ఆ ఎడమ చేతిని పూర్తిగా తొలగించవలసి వచ్చింది. ఈయన చేసిన చిత్రాలకు పబ్లిసిటీని కూడా ఈయనే నిర్వహించేవారు. ఈయన బాల్యంలో సంగీతంలో కృషి చేశారు. హరికథలు చెప్పేవారు. నాటకాలు కూడా ఆడేవారు. జకార్తాలో జరిగిన చలన చిత్రోత్సవంలో 'నర్తనశాల' చిత్రంలో కళాదర్శకుడుగా అద్భుతమైన పనితనం చూపించి నందుకు ఈయనకు ప్రతిష్ఠాత్మకమైన అవార్డు లభించింది.

### నృత్య ప్రదర్శనలో అంతరాయం

ఖాట్మండూ నగరంలో నేపాల్ కేన్సర్ సొసైటీ వారి అభ్యర్థనపై హేమమాలిని తన భరత నాట్య ప్రదర్శన ఇవ్వడానికి సమ్మతించింది. అత్యధిక ధరలకు టిక్కెట్లు విక్రయించడంతో విపరీతంగా డబ్బు వచ్చింది. ఆడిటోరియం లో ఇసుక వేస్తే రాలనంత జనం. హేమమాలిని రెండుమూడు శాస్త్రీయ నృత్యాలు

కొరవ 11 పేజీలో

# నీరసం తప్ప ఏ రసమూ లేదు! బాండిట్ క్వీన్

## చిత్ర పరామర్శ ✲ పాకాల వెంకటకృష్ణయ్య

అసదృశమైనది దృశ్యకళ; ఇది కళాకారుడి ఉపజ్ఞకు గీటురాయి. ఒకపాటి ప్రజ్ఞ ఉండేవాడు దీని జోలికి పోతే చేతులు కాల్చుకొని చతికల బడిపోవలసిందే.

కళాకారుడికి తానున్న సమాజం నుండి లభించేదంతా ముడిసరుకే. ఈ ముడి వస్తువును అసాధారణమైన రస దృష్టితో పరికించి సాలోచనా మగ్నుడవుతాడు. దీన్నే భావన అంటాం; ఈ భావనలో ముడి వస్తువును అంటుకొని ఉన్న మట్టి, మకిలి, ఘూర్ణితమై స్వచ్ఛమైన కళారూపం నిగనిగ లాడుతుంది. ఈ నైగనిగ్యం తొణికిసలాడే వస్తువును, కళాకారుడు తాను దర్శించి, మన ముందు ప్రదర్శిస్తాడు - చూచిన వాళ్లు 'బాపురే' అనేటట్లుగా. ఇదే కళా వాస్తవికత; అంతే గాని ఉన్నది ఉన్నట్లు చూపడం కళా ధర్మం కాదు.

తెలిసో, తెలియకో, దర్శకుడు ఈ మర్మాన్ని ఉల్లంఘించాడు. ఉన్నది ఉన్నట్లు చూపాలను కొన్నారు. ఉభయానికి స్వర్గానికి రెంటికి కాకుండా పోయ్యారు.

ఫూలన్‌దేవి జీవితంలోని యదార్థ సంఘటనలను కథగా దిద్ది తీర్చుకోవడంలో పూర్తిగా విఫలుడయ్యాడు దర్శకుడు శేఖర్ కపూర్. వాస్తవ దృశ్యాలను రసదృష్టితో వీక్షించలేక పోయ్యాడు; జరిగిన సంఘటనలను జరిగినట్లు చూపినందు వల్ల, దృశ్యాలన్నీ కాంతి హీనమై వెల వెల పోయ్యాయి. పర్యవసానంగా "బాండిట్ క్వీన్" నీరసంగా తయారైంది.

వ్యధార్త భరితమైన ఫూలన్‌దేవి జీవనంపై దర్శకుడికి సానుభూతి ఉన్నట్లు లేదు. అదే ఉంటే చిత్రం ఇట్లా బలాదూర్‌గా తయారై ఉండేది కాదు; సెన్సేషన్ మీద ఉన్న దృష్టి "సెన్సు" మీద లేదు. జానుల రానులపై ఐద్ధ చూపు కళ దిశగా ప్రసరించలేదు.

ఉన్నది ఉన్నట్లు చూపడం కళ కాదు. ఒకింత వాస్తవానికి రవంత కల్పన జోడించాలి. ఈ కల్పనవల్ల అలౌకికమైన కమనీయత - రామణీయకత ఏర్పడి చూపరులలో రసానుభూతిని కలిగిస్తుంది. అంతేగాని సహజత్వం అంటే యదార్థ వస్తు ప్రక్షేపం కాదు.

అది పడుగు పేకల సమన్వయం; కల్పించిన డిజైను - కలిసి వస్త్రం ఆకర్షణీయంగా తయారవుతుంది. చూచేవాళ్లకు కొనాలనిపిస్తుంది. బంగారం విలువైనదైనా, ముడి బంగారాన్ని మెడలో వేసుకోము. అగసాలె వాని చేతిలో అది ఆభరణంగా రూపు మార్చుకొన్నప్పుడు అలంకరించు కొంటాం; ఆనందిస్తాము. [illegible] కళలకే

కొరవ 11 పేజీలో

## తల్లి బిడ్డకు పాలిస్తే

2వ పేజీ కొరవ

గర్భాపుష్పాల్లో అనుమానం లేదిదా. అది ఒకొన్ని సమయంలో జగపనిదే నొప్పిగానే, పాలగడ్డలుగానే, ప్రమాద కారకమైన కైన్సర్ వంటివిగా గానే అనివార్యమైన మారబంగా ఏర్పడే సెగగడ్డలాగానే ఎంచి, నిరపాయకరంగా భావించి అశ్రద్ధ చేయరాదు. ఇంట్లోని పెద్దవాలపు వాళ్ళ అనుభవాలను ఆసరాగా తీసుకుని, ప్రక్కింటి బామ్మల సలహాలను పాటించి, స్వంత వైద్యాలకు పూనుకొని ఏవో ఆకులు, పసర్లు, పూసుకొని మందు, మంది జ్ఞానంతో జాప్యంచేసి ముదర బెట్టుకోరాదు. ఇలాంటి సందర్భాల్లో ముందుగా వైద్యుల సలహాలు ఎంతో అవసరం. అశ్రద్ధ అనేది ప్రమాదం. స్త్రీలకు కేన్సర్ అవహించే అవయవాలలో వక్షోజాలు ప్రధమ స్థానాన్ని అధిరోహిస్తున్నాయి. కనుక ఇది గమనించి అలక్ష్యం అమృతం విషం అన్న సామెతలో 'అమృతం' అన్న పదం చెరిపేసి జాగ్రత్త వహించడం ఆధునిక స్త్రీల బాధ్యత.

పిల్లలకు పాలు పట్టడంలో తల్లులు తమ నైపుణ్యాన్ని, బాధ్యతల్ని గుర్తెరిగి వుండాలి. బిడ్డ పాలు తాగిన వెంటనే రొమ్ముల్ని వత్తివేసి ఖాళీ చేయాల్సి వుంటుంది. మర్ని పాలు ఇన్ఫెక్షన్‌గా వానిని శుభ్రపరుస్తూ వుండాలి. ఈ శుభ్ర పర్చే చర్యలో అధిక సుద్ధికి రోయి డెట్టాల్ వంటి రసాయనిక పదార్థాల్ని వాడరాదు. కఠిన సబ్బు వాడకం కూడా మంచిది కాదు. గ్లిసరిన్ లాంటి ఆయిల్‌ను పూసుకొని మంచి గుడ్డతో తుడిచేసుకుంటే చాలు. లేదా నీళ్లతో కడిగేసుకున్నా చాలు. కొందరిలో పాలు లీకవుతూ వుంటాయి. అలాంటప్పుడు, ఏ పాత గుడ్డతోనో తుడవ కూడదు. ఉతికిన మంచి వస్త్రంతో గానీ, ఇందు నిమిత్తమై బజార్లో లభ్యమయ్యే హైజెనిక్ ప్యాడ్లను ఉపయోగించడం మంచిది. బిడ్డ పాలు తాగుతున్న ఆ పాతిక వారాలూ భర్తకు వాటిపై గల అధికారాన్ని తాత్కాలికంగా ఉపసంహరింప జేయడమూ అవసరమే. పాలిస్తున్న దశలో తల్లి తన ఆరోగ్యం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలి. బిడ్డను ఏకోణంలో పడుకో బెట్టుకుంటే తనకూ బిడ్డకూ వాటంగా, అనుకూలంగా ఉంటుందో ఆనైపుణ్యాన్ని తెల్సుకోవాలి. పాలు ఇస్తూ, ఇస్తూ నిద్రించిన తల్లి మూలంగా ఆరొమ్ము బిడ్డ ముక్కుకూ, మూతికీ అడ్డుపడి ఊపిరాడక మరణించిన శిశువుల ఉదంతాలూ వున్నాయి. బిడ్డ పాలుత్రాగే వయసులో తల్లి మంచి బ్రాసరీలు వాడాలి. పట్టి రవికలేసి వక్షోజాల్ని ఏడిచి పెట్టరాదు.

పాతిక వారాలు మించి శిశువుకు పాలివ్వడం అనవసరం. అక్కడ నుండి తేలికపాటి ఆహార పదార్థాల్ని తినిపించడం అలవర్చాలి. పాలు తక్కువగా వస్తున్నప్పుడు, బీరు త్రాగితే పాలు ఎక్కువగా ఉత్పత్తవుతాయని నగరాల్లో కొన్ని చోట్ల నాగరిక నెలతలు నిగదిస్తుంటారు. దానివలన అదనపుతూనూ ఆహారంతో ఏదైనా ఆనందం ఒదుగు తుందేమోగానీ, పాలు పెరగడం లేదు. బిడ్డకు అదనంగా ఒరిగేదేమీ లేదు.

ఎందరెన్ని చెప్పినా, తల్లి పాల కంపెనీలు ఎంతగా వాటి ప్రాముఖ్యత గూర్చి డబ్బా వాయించుకున్నా, వారి డబ్బాల ప్రక్కన పిహిల్లాంటి పాపల్ని కూర్చోబెట్టి చిత్రించినా, చంటి బిడ్డలకి తల్లిపాలను మించిన సంపూర్ణ దివ్యాహారం మరేదీ లేదు. అయితే కొన్ని పరిస్థితుల్లో ప్రకృతి సిద్ధమైన తల్లిపాలు విలువలు జేసి వికృతి బద్ధమైన ఇతర పాలు వాడాల్సి వుంటుంది. కాన్పు అయినాక కొందరు బాలింతలకు కొన్నాళ్ళ వరకు, అపస్మారక వ్యాధి వస్తుంది – అలాంటి దశలోనూ; తల్లి వస్త్రపతా ఉన్మాది అయినప్పుడూ; చను మొనలకు గాయాలున్నప్పుడూ; తల్లికి టైఫాయిడ్, మలేరియా, క్షయ వంటి వ్యాధులున్నప్పుడూ; చను మొనలు వెనక్కి తిరిగి, బిడ్డకు పాలు పీల్చడం కష్ట తరమైనప్పుడూ, తల్లి పాలుగిట్టక బిడ్డకు అలెర్జీ ఏర్పడి, అది చర్మ వ్యాధి రూపంలోనో, వాంతుల మాదిరిగానో విరోచనాల వలనో తలెత్తి నప్పుడూ, తల్లి పాలు బిడ్డకు తగినంతగా లేనప్పుడూ.... కృత్రిమ పాలు, గేదె లేదా ఆవు పాలు గత్యంతర మవుతాయి.

## చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

కల్పనలో ఇంత ప్రాముఖ్యం ఉంది. లలిత కళ విషయంలో కల్పన ప్రమేయం అప్రమేయం. మాంసాహారి ఎముకలు మెళ్లో వేసుకొని తిరుగుతుంటే చూచేవాళ్లకు ఎట్లా ఉంటుంది? సరిగ్గా అట్లాగే ఉంది 'బాండిట్ క్వీన్'.

చిత్రంలో రౌద్రం, కరుణం, ఇతరసాలు ప్రసక్తం కావాలి. ప్రేక్షకుల హృదయాల్లో వాటికి అనుగుణమైన స్థాయీ భావానుభూతులు రేకెత్తాలి. చిత్రమేమిటంటే సుమారు 2గం.ల సేపు నడిచే చిత్రంలో ఏరసమూ ప్రచలితం కాకపోవడం; నీరసానికి మాత్రం కొదవలేదు.

'రేప్'ను వెండితెరపై జరిగింది జరిగినట్లు చూపడం దర్శకుడిగా శేఖర్‌కపూర్ వైఫల్యానికి ప్రతీక. ఈ దృశ్యం ప్రేక్షకుల్లో చెప్పలేనంత వికారాన్ని కలిగిస్తుంది. రసపరంగా శృంగారానికి, వ్యవహార ప్రసిద్ధమైన సెక్సుకి (కామక్రీడ) తేడా తెలిసి ఉంటే దర్శకుడు ఈ నీచ ప్రలోభానికి పాల్పడి ఉండే వాడుకాదు. శృంగారం అలౌకిక రసానంద సంధాయిని. సెక్స్ వైయక్తిక సుఖ ప్రదాయిని. దీన్ని తెరమీద పారబెట్టి దర్శకుడు తాను భ్రష్టుడై, రసరాజమైన శృంగారాన్ని భ్రష్టు పట్టించాడు. ప్రేక్షకుల హృదయ కలశాలను కలుష పూరితం చేశారు.

పూలన్‌దేవిని మూకుమ్మడిగా రేప్ చేసినప్పుడుగాని, ఆమెను వివస్త్రను చేసి, బావి నుంచి నీళ్లు చేది తీసుకరమ్మని చెప్పినప్పుడు గాని ప్రేక్షకుల హృదయస్రోతాలు ఆర్ద్రం కావాలి. కన్నులు చెమ్మగిల్లాలి. కాని - మనలో ఏవిధమైన మార్పూ ఉండదు. ఎటువంటి కరుణ రసానుభూతి కలుగదు. ఆదృశ్యాలు కళాత్మకంగా చిత్రీకరించక పోవటమే అందుకు కారణం.

చింపి పేలికలను ఒకదానికొకటి అంటించి కుట్టినట్లయితే ఏర్పడేది సుందర మనోహరమైన వస్త్రం కాదు; రోత పుట్టించే అతుకుల బొంత.

యదార్థ సంఘటనలను, దృశ్యాలను యధాతథంగా ఒకదాని వెంట మరొక దాన్ని కూర్చుకొంటూ పోతే దృశ్యకళ అనిపించు కొంటుందా?

చెప్పుకోదగిన, మెచ్చుకోదగిన అంశం ఈ చిత్రంలో ఒకే ఒక్కటి; అది పూలన్‌దేవిగా నటించిన సీమా బిస్వాస్ నటన. మిగిలినదంతా పరమ చెత్త. సినిమా అద్యంతం డాక్యుమెంటరీ శైలిలో సాగుతుంది. అందువల్ల ఒక కథా చిత్రాన్ని చూచిన అనుభూతి మనలో మిగలదు. థియేటర్లోకి వెళ్లేముందు ఏ మనః స్థితిలో ఉంటామో, అదే స్థితిలో బయట పడతాం. కాకుంటే "రేప్" ప్రత్యక్ష దృశ్యం చూచిన వికారం మనల్ని వదిలి పెట్టదు. మహిళలు దీని ముఖం చూడటం లేదంటేనే చిత్రం నాసి తనానికి ఇంత కంటే వేరే వ్యాఖ్యాన మెందుకు?

## సినిమా

9వ పేజీ కొరవ

ప్రదర్శించింది. కానీ, అవి ప్రేక్షకులెవరికీ నచ్చలేదు. "సినిమా డాన్సులు చేయాలి" అంటూ గోలచేశారు. హేమమాలిని సభికులకు నమస్కరించి, మైక్ అందుకుంది. 'ప్రజాహిత కార్యం గనుక నా సొంత ఖర్చుతో మా ట్రూప్ తీసుకొని ఇంతదూరం వచ్చాను. సినిమా డాన్సులను వేదిక మీద హేమమాలిని చేస్తుందని మీరెలా అనుకున్నారు? నన్ను మన్నించండి," అంది. ఆ వెంటనే తెరపడింది. ఈ రభసతో ఆమెగ్రీన్ రూం గుండా తన ట్రూప్‌తో అక్కడ్నుంచి చల్లగా నిష్క్రమించిందని ఆ తర్వాత ప్రేక్షకులకు తెలిశాక గుడ్లు తేలవేశారు. ఇక డాన్స్ ప్రదర్శనలు ఇవ్వరాదనే నిర్ణయానికొచ్చిందామె.

### రమ్యకృష్ణ ద్విపాత్రాభినయం

మౌళి దర్శకత్వం వహించే "ఏమండీ...మన అమ్మాయే" చిత్రంలో ద్విపాత్రాభినయం చేసే రమ్యకృష్ణతో పాటు హీరోగా ఆనంద్, ఒక విలక్షణమైన పాత్రలో వాణిశ్రీ నటిస్తారు.

## బంద్ సూపర్ సక్సెస్

4 పేజీ కొరవ

సంజీవ రెడ్డి కలెక్టర్‌ను విధులకు హాజరు కావద్దని బలవంత పెట్టారు. సీటు లోంచి లేచి రావాలని వాదనకు దిగారు. జిల్లాలో శాంతి భద్రతలు చూడ వల్సిన బాధ్యత తనపై వుందని కలెక్టర్ సీటులోంచి లేవలేదు. ఈ గొడవ తెలిసిపరుగెత్తు కొచ్చిన ఎస్‌పి పూర్ణచంద్ర రావు కాంగ్రెస్ నాయకులను ఎట్టకేలకు కలెక్టరేట్ మెట్లు దించారు. మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, రామనారాయణ రెడ్డి వరండాలో కాసేపు బైఠాయింపు జరిపారు. వీరంతా కలెక్టరేట్ ఆవరణంలోని మెజిస్ట్రేట్ కోర్టుకు వెళ్లి ఎసిజె జడ్జి శ్యామసుందర రావును కూడా సీటు నుంచి కాంగ్రెస్ నాయకులు కోరారు. టెలిగ్రాఫ్ కార్యాలయంలో వుద్యోగులను కూడా ఈ పార్టీ నాయకులే బయటకు పంపారు.

కాంగ్రెస్ వారి బంద్ నిర్వహణ తీరును చూసిన బిజెపి నాయకులు ఆర్టీసీ డివిజనల్ మేనేజరు కార్యాలయంలోకి చొచ్చుకు పోవాలని ప్రయత్నించారు. ఆర్టీసీ సెక్యూరిటీ, పోలీసులు వీరిని నిలువరించ ప్రయత్నించగా ఎస్పి అక్కడకూ వచ్చి బిజెపి నాయకులకు నచ్చ చెప్పి పంపారు. కె.వి.ఆర్. సెంటర్లో యువజన కాంగ్రెస్ నాయకుడు ప్రవీణ్ కుమార్ రెడ్డి చేసిన తులిపి పనివల్ల అనవసరపు గొడవ జరిగేందుకు రంగం సిద్ధమయ్యింది. కాని వివేకానంద రెడ్డి దాన్ని సర్దుబాటు చేశారు. బంద్‌లో ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొనేందుకు ఎఎస్‌పి నాయకత్వంలో 14 మొబైల్ పార్టీలు ఏర్పాటు చేసినా, కలెక్టరేట్, ఆర్టీసీ డిపోల వద్ద వారి వైఫల్యం కొట్టొచ్చినట్లు కనపడింది. బంద్‌లో కూడా కాంగ్రెస్ పార్టీలోని వర్గ రాజకీయం బహిర్గతం కావడం అసహ్యం మనిపించింది. మధ్యాహ్నం మూడు గంటల తరువాత బంద్ వాతావరణం మటుమాయమై పోయింది.

## 50ఏళ్ల క్రితం ఈవారం

3 పేజీకొరవ

జరిగింది. టీచర్ల సౌకర్యాలను గురించి అనేక తీర్మానాలు చేయబడినవి

-రంగయ్య

**పొదిలి**

20తేది డిప్టీ కలెక్టరు ఆధ్వర్యాన వెంకటేశ్వర శర్మగారిని తాలూకా సంఘ ప్రతినిధిగా ఎన్నుకొన్నారు.

-మల్లికార్జునరావు

**గుండవోలు**

బియ్యం రేషను కొట్టునుండి బస్తాలు మాట వినకుండా యెక్కడి కంటే అక్కడికి వెళ్లిపోతున్నవని రాత్రిళ్లు గుడ్లగూబలు లెస అరుస్తున్నవి. మనకెట్ల అగుపడతవి?

-రేషనుకార్డు

బడిటీచర్లలో ఒకాయన జనవరి నుండి లేరు. మా పిల్లల చదువు సంగతి మీకెందుకు బడుతుంది జి.బో. ప్రెసిడెంటుగారు

-పేరెంటు

**సూళ్లూరుపేట**

హరిజన బీదవిద్యార్థుల సహాయార్థము 42లో సంఘం యేర్పడ్డది. 6గురు విద్యార్థుల నుండి సంఖ్య 50కి పెరిగింది. వీరికి వసతి గృహం ఏర్పరచాలని తీర్మానించారు. సుమారు 10వేలు ఖర్చవుతుంది. దాతలు సాయపడ ప్రార్థన.

**ఆత్మకూరు**

తాలూకా గ్రామోద్యోగుల సభ 14తేదిన జరిగింది. కరణం మునసబులకు రు.40లు బేసిక్ జీతం రు.20లు వెట్టి తలారులకు జీతం, అందరితో బాటు కరువు భత్యం ఇవ్వాలని తీర్మానించారు.

**రాపూరు**

మిల్లుగుడ్డలు తాసిల్దారొచ్చి చెప్పిందాక ఇవ్వనంటారు. తాసిల్దారొచ్చి పొయ్యాక, అంతా వారే తీసుకొన్నారంటారు. ఇదేమి ఖర్మ! యిన్నిటికైనా వ్యాపారస్థులు పౌరుల మీద ఆధారపడ వలసిందే. మూణ్నాళ్ల లాభానికి మూతులు కాలేదెందుకు వణిజార్లారా!

# KORA



SARASWATHI NAGAR, NELLORE - 3.
Ph: 23210, 26054, 24054.

## INSTITUTE OF ENGINEERING AND MEDICAL ENTRANCE COACHING

Hearty Congratulations to our Successful Students in Eamcet - 96 (MEDICAL)



STATE 6th RANK **P. PRADEEP KUMAR**
H.T. NO. 5503311



V. HARI PRASAD REDDY
H.T.No. 5501032
STATE RANK - 25



C. RAVINDRA REDDY
H.T.NO. 5505111
STATE RANK - 41



PNV. VAMSIDHAR
H.T.NO. 5503128
STATE RANK - 61



N.RAVISANKAR
H.T.NO. 5503207
STATE RANK - 63



C. MADHAN MOHAN
H.T.NO. 5507185
STATE RANK - 66



G. BADRI NARAYANA
H.T. NO. 5501019
STATE RANK - 72



S. NAGENDRA PRASAD
H.T.NO. 5504312
STAE RANK - 78



P. MITHUN CHAKRAVARTHY
H.T.NO. 5501268
STATE RANK - 87



ML. ANANTH
H.T.NO. 5502199
STATE RANK - 90

# MEDICAL

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | SUNIL KUMAR REDDY. Y<br>H.T.NO. 5501614 RANK: 358 | BABY SIREESHA. T<br>H.T.NO. 5602374 RANK: 523 | KRISHNAIAH. MV<br>H.T.NO. 5506216 RANK: 605 | SIREESHA. M<br>H.T.NO. 5507010 RANK: 692 |
| MAHESH BABU. M<br>H.T.NO. 5501674 RANK: 105 | SATEESH KUMAR. Y.V<br>H.T.NO. 5508041 RANK: 258 | VENKATESWARLU. K<br>H.T.NO. 5504145 RANK: 368 | JAYENDER REDDY. C<br>H.T.NO. 5504011 RANK: 534 | RAVIPRAKASH. K<br>H.T.NO. 5504473 RANK: 609 | KALPANA. N<br>H.T.NO. 5501274 RANK: 694 |
| NAVEEN KUMAR. G<br>H.T.NO. 5503130 RANK: 116 | VENKAT KUMAR. B<br>H.T.NO. 5502474 RANK: 274 | RAMA KRISHNA. Y<br>H.T.NO. 5507258 RANK: 376 | SREE RAM. P<br>H.T.NO. 5506124 RANK: 540 | VASUDEVA REDDY. M<br>H.T.NO. 5501615 RANK: 623 | ANJANI KUMAR. R<br>H.T.NO. 5504061 RANK: 696 |
| RAJESH. B<br>H.T.NO. 5003370 RANK: 117 | SUPRIYA. G<br>H.T.NO. RANK: 274 | MADHU. D<br>H.T.NO. 5502225 RANK: 403 | SITARAM CHOWDARY. N<br>H.T.NO. 5504157 RANK: 548 | RAVISANKAR. M<br>H.T.NO. 5501695 RANK: 635 | CHETAN KUMAR. S<br>H.T.NO. 5501716 RANK: 699 |
| RAMKISHORE REDDY .P<br>H.T.NO. RANK: 123 | GOUTHAM REDDY. T<br>H.T.NO. 5501489 RANK: 281 | BHARATHI. U<br>H.T.NO. 5503400 RANK: 415 | KRISHNA MOHAN. G<br>H.T.NO. 5502056 RANK: 560 | RAGHAVENDRA. M<br>H.T.NO. 5501540 RANK: 648 | AJAY KUMAR. R<br>H.T.NO. 5502227 RANK: 700 |
| MURAHARI. C<br>H.T.NO. 5505054 RANK: 126 | SESHASAYANA REDDY. C<br>H.T.NO. 5502358 RANK: 302 | SWAPNA. K<br>H.T.NO. 5507088 RANK: 418 | SIREESHA. K<br>H.T.NO. 5507254 RANK: 577 | NISHITHA. P<br>H.T.NO. 5501653 RANK: 656 | LAVANYA. B<br>H.T.NO. 5501703 RANK: 7[illegible] |
| RAMESH. U<br>H.T.NO. 5506187 RANK: 151 | KALYAN. S<br>H.T.NO. 5501386 RANK: 311 | RANJIT KUMAR. G<br>H.T.NO. 5503019 RANK: 427 | PRAVEEN KUMAR REDDY. B<br>H.T.NO. 5506341 RANK: 583 | SAILAJA. M<br>H.T.NO. 5506044 RANK: 661 | PRASHANT. K<br>H.T.NO. 5505056 RANK: 738 |
| SHYAMSUNDAR REDDY. P<br>H.T.NO.5501617 RANK: 173 | ARSHAD. MD<br>H.T.NO. 5506224 RANK: 319 | SUBHA PRADA. M<br>H.T.NO. 5402087 RANK: 474 | JHANSI RANI. L<br>H.T.NO. 5505171 RANK: 587 | VENUGOPAL. C<br>H.T.NO. 5505301 RANK: 662 | VENUGOPAL REDDY<br>H.T.NO. 5505310 RANK: 762 |
| MADHURI. S<br>H.T.NO. 5404232 RANK:183 | KRISHNA REDDY. K<br>H.T.NO. 5504440 RANK: 324 | MARUTHI BABU. K<br>H.T.NO. 5501266 RANK: 482 | HEMA VIJAY KUMAR. A<br>H.T.NO. 5504320 RANK: 589 | RAJANI. K<br>H.T.NO. 5501723 RANK: 663 | SWARUPA<br>H.T.NO. 5503268 RANK: 770 |
| ASWHIN KUMAR REDDY. G<br>H.T.NO. 5501193 RANK: 204 | SRI RAM NAVEEN. P<br>H.T.NO. 5504007 RANK: 351 | SREENU BABU. K<br>H.T.NO. 5503323 RANK: 491 | BALAJI. M<br>H.T.NO. 5505174 RANK: 590 | SIVAIAH. P<br>H.T.NO. 5504258 RANK: 665 | APARNA. S<br>H.T.NO. 5501023 RANK: 771 |
| MADHUSUDHAN REDDY. B<br>H.T.NO. 5502030 RANK: 210 | ANANDA BABU. K<br>H.T.NO. 5505308 RANK: 352 | VANI. M<br>H.T.NO. 5504396 RANK: 521 | YAMINI. P<br>H.T.NO. 5501460 RANK: 594 | PRATHIMA. C<br>H.T.NO. 5504297 RANK: 685 | RAMA JYOTHI. S<br>H.T.NO. 5504070 RANK: 775 |

THIS LIST IS EXCLUSIVE OF RESERVATIONS. ABOUT FORTY TO FIFTY OF OUR STUDENTS WILL GET SELECTION UNDER RESERVATION CATEGORIES LIKE B.C., S.C., EX. SER. ETC.,

**Note: Long Term and Intensive Batches will commence in the last week of August - 96.**
**For application form and prospectus, send Rs.50/- by M.O. only.**

- DIRECTOR

ROOPA ADS. Ph:23465

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore